Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యుం II.] 1942 వ సం॥ డిశంబరు నెల 18 వ తేది శుక్రవారం [వె 50 ప.



భారత సర్వసేనాని జనరలు వావెలుగారు.

## భారత సర్వసేనాధికారి జనరలు వావెలు ప్రకటన.

●

ఇండియాకు శత్రుభీతి తగ్గినది.

●

సంరక్షణ యేర్పాటులు తృప్తికరంగా నున్నవి.

●

"ఇండియాకు శత్రుదాడి భయం యిదివరకు కన్న యిపుడు చాల తగ్గినది; ఇపుడు పరిస్థితులు మారినవి, జపానువారు యిపుడుగాని ఇండియాపైకి వస్తే తగురీతి సన్మానింప బడుదురు."

అని జనరలు సర్ ఆర్చిబాల్డు వేవలుగారు, భారతదేశ సర్వసేనాధిపతి పత్రికా ప్రతినిధులతో ముచ్చటించుచు నుడివిరి. వారును, భారత విమానశాఖ సేనాధిపతి ఎయిరు చీఫ్ మార్షలు సర్ రిచర్డు పియర్సిగారును గతవారాంతమున జరిగిన దక్షిణ ఇండియా సైనిక విన్యాసముల సందర్భమున యుద్ధ సంచిక ప్రతినిధితోను, తదితర విలేఖరులతోను ముచ్చటించిరి. ఆ సందర్భమున వారిట్లు దెలిపిరి :—

### బ్రిటిషు సేనలకు బర్మావారు తోడ్పడెద రా?

భారతీయసైన్యం బర్మాపై దాడి వెడలినచో బర్మనులు బ్రిటిషు సేనలకు తోడ్పడెదరని మీరు తలంచెదరాయని యడుగ, తాము యిటీవల చూచి వచ్చిన దానినిబట్టి తోడ్పడెదరనియే నమ్ముచున్నా నని చెప్పి, ఇండియాకు జపాను ఉపద్రవము గూర్చి పై విధముగ తెలిపిరి.

జపానువారు గడచిన వసంతకాలమునుండి ఓడుచున్నారు. కావున శత్రుదాడి భయము యిదివరకున్నంత యిపుడు ఇండియాకు లేదనిరి.

### ఆసాంపై దాడి జరుగదు.

ఆస్సాంపై దాడి యిపుడు జరుగనేరదని వేరొక ప్రశ్నకు బదులుగ చెప్పిరి.

సింహళంపై వారు దాడి చేసినచో వారు తరుముకొని యిచటికి రాకుండ దక్షిణ సైన్యం కాపాడ

గల్గునా యని యడుగ, విమానదళంవారు శత్రువు సింహళంపైకి రాకుండానే వారించగలరనియు, యిపుడట్టి దాడి బెదరు ఎనిమిది నెలలక్రింద నున్నంతలేదనియు, అయినను రక్షణ ప్రయత్నాలు ఏ మాత్రం అశ్రద్ధ చేయలేమనియు చెప్పిరి.

### అయినా తయారుగా ఉన్నాం

"ఇతరచోట్ల ఎక్కువ ఒత్తిడి కలిగినపుడు జపానువారు యీ ప్రాంతాలపై దాడిచేసి దృష్టి మరల్చుటకు ప్రయత్నించినను ప్రయత్నింపవచ్చు ననిరి. కాని యిదివరకుకన్న యిపుడు చాల ఎక్కువ సిద్ధంగా నున్నామని తెలిపిరి."

### శత్రు జలాంతర్గాములు

ఇండియాచుట్టు శత్రు జలాంతర్గాముల చర్య లెట్లున్నవని యడుగ, కొంత సందడియుంది కాని, ఎక్కువ నష్టం కలుగలేదని చెప్పిరి.

### చిట్టగాంగుపై దాడి

చిట్టగాంగుపై దాడిచేయుటలో శత్రువు ఉద్దేశ మేమయియుండును అని మా ప్రతినిధి యడుగ వారిట్లు దెలిపిరి:—"ఇటీవల రెండుసార్లు చిట గాంగుపై జపానువారు దాడి చేసిరి. కాని నష్టం చాల తక్కువ సైనికశాఖకు నష్టం బొత్తిగ తక్కువ. సివిలు ప్రజల నష్టంకూడ తక్కువే. పెద్ద నౌకలజట్టును కొట్టితిమని జపాను ప్రకటిం చెను, కాని అదంతా వట్టి అబద్ధం."

"సైనికులు ఎక్కడ చేర్చుకొనబడిరో అక్క డనే నిలిపియుంచాలని నిబంధన చేయ లేము. సైనిక వ్యూహంలో అవసరాన్నిబట్టి సైనికులను మారుస్తూవుండాలి. ఇండియా అం తటను అవసరమగు మదరాసు విమాన విధ్వం సక సైనిక దళంపై చాల ఆధారపడియున్నది. సైనికులకు ప్రజలకు మంచి అన్యోన్యత సామ రస్యమును గలవు" అని వేరొక ప్రశ్నకు బదు లు చెప్పిరి.

### సైన్యంలోని మద్రాసీల ప్రశంస.

ఇటీవల సైన్యంలో మదరాసీలు యెక్కువ చేర్చుకొనబడియున్నారుగదా, వారినిగూర్చి మీ అభిప్రాయమేమియని అడుగ, మదరాసీలు చాల సమర్థులగు సైనికులగుదురని ఆశించుచున్నా మనిరి. ఇదివరకు మదరాసీలను ఎక్కువగ చేర్చుకొనుటలేదనియు, యిటీవల ఆఫ్రికా ఎడారి యుద్ధంలో మదరాసు బాటరీ సైనికులు చాల బాగుగ పనిచేసిరనియు, మదరాసీ సైనికులందరు ఆ కీర్తిని కాపాడెదరని ఆశించుచున్నామనియు వావెలుగారు తెలిపిరి. "ఆర్టిలరీయందును, విమాన విధ్వంసక దళమునందును మదరాసీలు యెక్కువగనున్నారు. కొద్ది నెలలక్రిందట నేను బెంగుళూరు పోయిచూస్తిని, వారు చాల నేర్పరు లుగ అగుపడ్డారు."

### వైద్యశాలల అభివృద్ధి

"భారతీయ సైనికులకొరకున్న ఆస్పత్రు లలో చాల అభివృద్ధికరమగు మార్పులు జరుగ వలసియున్నది. అందుకు తగు ప్రయత్నం చేయుచున్నాము. వీలగునంతమంది డాక్టరు లను చేర్చుకోవాలని చూస్తున్నాము. సైనికు లకు సదుపాయాలు యెక్కువ చేస్తున్నాము. ఈ విషయంలో సివిలు ప్రజలుకూడ చాల సహా యం చేయవచ్చును" అని సేనాధిపతి నుడివెను.

### ప్రజల సహకారం

జపానుదాడిని నిరోధించుటకు ప్రజల సహ కారము అవసరమని మీరు భావించెదరా, అని యడుగ ప్రజల సహకారం యెంత యెక్కువగ వుంటే అంతమంచిదనిరి.

### లిబియా యుద్ధం

లిబియా యుద్ధంలో మాంద్యం యేర్పడుటను గూర్చి చర్చించుచు ఎల్. ఎగేలావద్ద శత్రువులు ఘట్టిశిబిర మేర్పరచుకొనిరి. కాని దాన్ని మన వారు ముట్టడి చేతురనుటకు సందేహం లేదనిరి. తయారగుటకు వ్యవధికొరకే యీ మాంద్య మేర్పడియుండెను. జనరలు అలగ్జాండరుగారి ప్లానేమిటో తనకు తెలియదుగాని శత్రువాచోటు నుండి తరిమివేయబడుననుటకు తనకెట్టి సందే హం లేదనిరి.

### వర్షాభావమునకు విచారము.

ఈ ప్రాంతాలలో వానలులేక పంటలు పోయి నందున ప్రజలకు కలుగుచున్న కష్టంగూర్చి తానే ముచ్చటించుచు సేనాధిపతి చాల సానుభూతి వెల్ల డించెను.



# ఒక ఏడాదిలో జపాను నష్టం.

## మంత్రులు తమ పొరపాటు గుర్తించేరు.

అమెరికా యుద్ధంలో దిగిన వార్షిక దినమున అమెరికా అధ్యక్షుడగు రూజువెల్టుగారును, చర్చిలుగారును సందేశాలను పంపుకొనిరి. ఉభయులుకూడా జపాను దురాక్రమణశక్తి పూర్తిగ నాశనంకావాలనే కోర్కె ప్రకటించేరు.

జపాను నౌకా నష్టం-తగిన శాస్తి.

జపానుకు తగిన శాస్తి జరిగింది. సైనికుల లోను, వర్తక నౌకలలోను 1/5 వంతు నష్టం కలిగినట్లు జపాను అధికారులే ప్రకటించిరి. జపాను నౌకా నష్టము చాల యెక్కువగుటచే వారికి సప్లయిలు అందకుండా వున్నాయని అమెరికా మంత్రి కర్నలు నాక్సుగారన్నారు. అయినను జపానుకి యింకను ఎంతో ఉత్పత్తి శక్తి మిగిలి యున్నదని మరచిపోరాదు. జపాను మోసం చేసి, యీ శతాబ్ద ప్రారంభంలో పాశ్చాత్య దేశాలతో స్నేహం చేసుకొని, పాశ్చాత్య దేశాల ప్రజాప్రతినిధి ప్రభుత్వాదర్శములందు నమ్మక మున్నట్లు నటించి, వాటి సహాయంపొంది తన పరిశ్రమలన్ని అభివృద్ధి చేసుకొంది. తన ఆయుధ సామగ్రి యెక్కువచేసుకొని యిపుడు ప్రపంచమంతటిపై తిరుగబడి, తూర్పు దేశాల స్వాతంత్ర్యానికి మహోపద్రవంగానుంది. మిత్ర దేశాలతో రాయబారాలు జరుపుతూనే, అక్షరాజ్యాలతో మంచిగానుండి, యూరోపులో యుద్ధ పరిస్థితులు విషమించగానే, అదివరకున్న ఒడంబడిక యత్నాలన్ని వదలి, దురాక్రమణకు ప్రారంభించింది. కాని చీనా దీనికి పెద్ద గోడ పెట్టినట్లు అడ్డంగా పీరం వేసుకకూర్చుంది. మంచూరియాను ఆక్రమించినానక, కొద్ది వారాలలో చీనానంతా మింగేవచ్చునని జపాను సైనికాధికారులు తలంచిరి. కాని అట్లు జరుగలేదు. ఏషియాఖండ స్వాతంత్ర్యానికి రక్షకొమ్మగ చీనా, అతిధైర్యంతో పోరాడి జపాను దురాక్రమణను నిరోధించగలిగెను. అందుచే జపాను ప్రధాన మంత్రి టోజోగారే "జపాను యుద్ధం చాల చిక్కులు నష్టాలు కలుగజేసింది" అని అంగీకరింపక తప్పిందికాదు. చీనా యుద్ధ వైఖరి గమనించి, యికదాన్ని పూర్తిగ ఆక్రమించుట అసాధ్యమని జపాను అధికారులు బాగా గుర్తించినట్లున్నారు. అందుకే తమకు యింకా యెక్కువ రాజ్యాల నాక్రమించాలని ఆశ లేదని నుడువుచున్నారు.



## సెలవు:

డిశంబరు 25 వ తేది శుక్రవారం క్రిష్టమసు సెలవు దినమగుటచే, ఆ రోజున 'యుద్ధ సంచిక' వెలువడదు. మరల 1943 జనవరి 1 వ తేదీన ప్రకటించబడును.

## సంగ్రహ వార్తలు.

మందుగుండు సామానులు ఇండియాలో యుద్ధానికి పూర్వంకన్న యిపుడు అనేకరెట్లు అధికంగా తయారగుచున్నవి. రైఫిలు తుపాకులు ఆరు రెట్లు, మరఫిరంగులు ఎనిమిది రెట్లు, సన్నీలు పదిరెట్లు, తుపాకులు, ఫిరంగి బండ్లు 24 రెట్లు అధికంగా తయారు చేయబడుచున్నవి. ఈ వస్తువులు తయారుచేయుటకు పరిశ్రమల అభివృద్ధికి రూపాయలు 7,00,00,000 కన్న యెక్కువ ఖర్చు చేయబడినవి. ఇంకను రూపాయలు 16,00,00,000 వెచ్చించే స్కీము సిద్ధంగనుంది. క్రొత్త రకం ఫిరంగి గుండ్లు, విమానాలను, టాంకులను కొట్టే గుండ్లుకూడ యెక్కువగ తయారు చేయబడినవి.

* * *

600 మోటారు బండ్లను బొగ్గుతో నడిచే బండ్లుగ మార్చినచో 10 లక్షల గాలనుల పెట్రోలు సంవత్సరానికి మిగల్చవచ్చును. బొగ్గు మణుగు 1 కి రూ 2-12-0 లు చొప్పున విక్రయించబడుచున్నది కనుక ఒక బస్సు లేక లారీ బొగ్గు గాసు బండిగ మార్చినచో నెలకు 2,000 మైళ్లు నడిచేయడల అది నెలకు రూ 200 లు ఖర్చు మిగల్చ కలుగును. అట్టి బండి గాలను పెట్రోలుకి 12 మైళ్లు నడిచేయడల, దినానికి ఒక గాలను ఖర్చుచేసేయడల, యిపుడు బొగ్గు గాసుతో నడచినచో నెలకు 140 గాలనులు లేక ఏడాదికి 1,680 గాలనుల పెట్రోలు మిగుల్చును.

* * *

ఇండియా రక్షణ ఋణములకు 1942 వ సం॥ అక్టోబరు 3 వ తేదివరకు మొత్తం 1,25,48,57,000 రూపాయలు వసూలయింది.

* * *

ఇండియాలో 55,093 జనులకు ఒక శిక్షణపొందిన నర్సు చొప్పున వున్నారు.

# జర్మనీ ప్రచారపు యుక్తులు.

జర్మనీలోని నాజీ పార్టీ ప్రచారకులు, క్రొత్త యుక్తులు అనుసరిస్తున్నారు. కాని, చివరకు జరిగే సంగతులనుబట్టి అబద్ధాలన్నీ బయలుపడతాయని గుర్తించినట్లు లేదు. వారు అనుసరించుచున్న వివిధ ప్రచార పద్ధతులను వివరించుచు బ్రిటిషు రేడియో సంస్థయొక్క ప్రచార నిపుణుడగు డబ్ల్యు ఎ. సింక్లరుగారు ఒక ఉపన్యాసం చేసిరి అందు వారిట్లు తెలిపిరి :

అంతర్జాతీయ సమాచార సంస్థ (ఇంటర్నేషనలు ఇంఫర్మేషను బీరో) అను వార్తా సంస్థయొకటి ఉన్నట్లు దానిలోని వార్తలు తాము చెపుతున్నట్లు, ప్రపంచం అంతా నమ్మాలని జర్మనీ అధికారుల ఉద్దేశం. అందుకోసమని మూడు వారాలనుండి, యీ వార్తా సంస్థలోని వార్తలను రేడియోలోను ఉదహరించుచున్నారు. కాని యిటువంటి సంస్థయేదీ, ఏతటస్థ దేశంలోను లేదు. అదివరకు జర్మను రేడియోలు, తటస్థ దేశాలలోని పత్రికలలో పడ్డాయని ఏవో అబద్ధాలన్నీ కల్పించి చెపుతూ వుండేది. అంటే జర్మను సేనలు ఏదో ఒక ప్రాంతాన్ని ఆక్రమించేయని ఆ పత్రికలో పడినట్లు బెర్లిను రేడియో చెప్పేది. అందుచే బ్రిటిషు రేడియో అది అసత్యమని రుజువుచేయుటకై, సదరు పత్రికలలోని అందుకు సంబంధించిన వార్తాభాగాలు ఎత్తి తమ రేడియోలో ఉదహరించే సరికి జర్మను ప్రచారం అబద్ధమని బయలుపడేది. ఇక లాభంలేదని యిపుడు క్రొత్త యుక్తి జర్మనులు అనుసరిస్తున్నారు.

ఇంటర్నేషనలు ఇంఫర్మేషను బీరో యుద్ధంలో పక్షపాతంలేని తటస్థ సంస్థయని అందరికి నచ్చజెప్పడానికి, జర్మను రేడియో ఈ బీరోయొక్క వార్తలను ముందు ఉదహరించి, తరువాత జర్మను సేనాధికారులు ప్రకటిస్తేగాని అవి సరియైనవిగా ఎంచవద్దని హెచ్చరిస్తూవుంటుంది. నాజీ పార్టీ అధికారులు, చాల అసందర్భపు అబద్ధాలకు తాము బాధ్యతవహించి అపకీర్తి పాలవడం యిష్టంలేనపుడు, ఆ అబద్ధపు వార్తలన్నీ యీ బీరో వార్తగ ప్రకటిస్తువుంటారు.

ఈ క్రొత్త సంస్థా సృష్టికి కారణాలు లేకపోలేదు. యుద్ధ ప్రారంభంలో జర్మనులు వడివడిగా గెలుస్తున్నపుడు, వారి రేడియో విన్నవారంతా, జర్మనీ ప్రచారవాక్యాలన్నీ అసత్యాలే కాని, జర్మను హై కమాండు ప్రకటించే వార్తలు తప్పక నిజమని ప్రజలంటూ వుండేవారు. జర్మనీ సైన్యాలు పలానీ చోటికి వెళ్లేయని జర్మను హై కమాండు ప్రకటిస్తే, అవక్కడ ఉన్నట్లే నమ్మవచ్చుననుకునేవారు. కాని ఆ వార్తలపుడు నమ్మకం కలిగించవని యిపుడు నమ్మకం తొలగించడానికి కారణం ఏమంటే, అపుడు జర్మనులు ముందు ప్రకటించిన ప్రకారం సైన్యాలను తరువాతనైనా ఆయా చోట్లకు పంపగల్గియుండేవారు. ఇపుడు పంపలేకుండా యున్నారు. అందుచే అపుడు నమ్మకం కలిగించిన అబద్ధాలు యిపుడు నమ్మకం కలిగించలేకుండా వున్నాయి.

ఇంగ్లాండుపై విమానదాడి చేసిన రోజులలో జర్మను హై కమాండువారు ఇంగ్లాండుపై ఆకాశమంతా జర్మను విమానాల వశమయింది. రాయలు విమానాలు పూర్తిగ తరిమివేయ బడ్డాయని ప్రకటించేరు. ఒక వారంలో అట్లా చేయగలమని ఊహించి అట్లా ప్రకటించేరు. కాని వారం కాదు నెలలు గడిచినా అట్లా చేయలేకపోయినందున, హై కమాండు వార్తలుకూడ కల్లలేయని పత్రికలు చదివేవారికి, రేడియోలు వినేవారికి స్పష్టమయింది.

ఇపుడు అంతర్జాతీయ వార్తా సంస్థయొకటి, జర్మను ప్రచారక శాఖవారు వారి మనసులో సృష్టించుకొని, తామే కొన్ని చెప్పరాని అబద్ధపు వార్తలు వ్రాసి, యీ సంస్థ వార్తలుగ ప్రకటిస్తున్నారు. క్రమేణ యుద్ధ సంఘటనలు జర్మనీకి ప్రతికూలంగా తిరిగిన కొలది యీ అసత్యాలన్నీ బయలు పడతాయి. కాని యీ లోగా యిదో సంస్థ నిజంగావుందని, దాని కార్యాలయాన్ని వర్ణించుతు, ఫోటోలుగూడా తీసి జర్మనులు ప్రకటించగలరు.



# బాంబులు వేసే విధం.

"మన బాంబులన్ని గురిచూసిన చోట సరిగ పడినవి. ఇంకో జపాను బారకాసు లేక గూడ్సు యావరణ లేక నౌకలుండే చోటు, రాయలు విమానాలచేత శిధిలం చేయబడెను. ఇండియా రక్షణకై వేరొక దెబ్బ కొట్టబడెను.

అని వార్తలు చూస్తూవుంటారు. ఇదెట్లా జరుగుతుందో మీకేమయినా తెలుసునా?

బాంబులు వేయడంలో విమానంలోనుండే నావిగేటరుపై ముఖ్య బాధ్యతగలదు. కాని అతనికిని విమానం నడిపించే వైమానికుడికి మంచి అన్యోన్యత వుంటేగాని మంచి ఫలితం చేకూరదు. దిగువ ఏలక్ష్యంపై బాంబు వేయదలచిరో దానిపై యెగురుచున్న కొద్ది క్షణములలో వాడు చేసే పనిపైని ఆ దాడియొక్క ప్రయోజనమంతా ఆధారపడియుండును.

విమానం లక్ష్యాన్ని చేరుచున్న కొలది దిగువ నుండి ఫిరంగులు ప్రేలుస్తారని తప్పక ఊహించు కోవలసియుండును. అందుచే వాటిని తప్పించుకొనుచు వైమానికుడు విమానాన్ని నడిపించును. కానీ సరిగ లక్ష్యంపైకి రాగానే విమానాన్ని సూటిగ నడిపించాలి. బాంబు వేయడానికి గురిచూస్తువుండే నావిగేటరు దృష్టినుండి లక్ష్యం తప్పిపోకుండా విమానాన్ని నడిపిస్తువుండాలి. "ఎడమకు," "కొంచెం కుడికి," "సరిసరి," "నిదానం" అని బాంబులు వేసేవాడు అంటువుంటే ఆప్రకారం వైమానికుడు విమానం నడిపిస్తూ, "బాంబులు పడ్డాయి" అని చెప్పగానే విమానాన్ని దిగువ ఫిరంగుల బారినుండి తప్పించుకొనుటకు అతిదూరంగా వడిగా మీదుగా విమానం యెగిరి పోవచ్చును.

విమాన నడకను తన లక్ష్యాన్ని తప్పిపోకుండా చూసుకొంటు వైమానికునకు సూచనలు చేయుచు నావిగేటరు నడిపించాలి. అతడొక క్షణమైన ఏమరియుండరాదు.

# ఇండియను మిలిటరీ పోలీసు.

భారతదేశ సైన్యంలో త్వరలో "ఎర్ర టోపీలు" అగుపడతాయి. పోలీసుని ఎర్రటోపీ లంటారు. భారతీయ మిలిటరీ పోలీసు ట్రెయినింగు స్కూలు త్వరలో పెర్షియా, ఇరాకు సైన్యాధికారం క్రింద యేర్పడును.

ఇందు శిక్షణ పొందేవారిని కేవలం పోలీసు వారుగ నుంచడం ఉద్దేశంకాదు, భారతీయ సిపాయీలకు సహాయం చేయడమే వారి కర్తవ్యం. సిపాయిలకు సహాయంచేయుటే తమ పనిగాని వారిని నిరశించుటకాదని తమ చర్యవలన రుజువు చేయగల ప్రతి భారతీయ మిలిటరీ పోలీసువానికి జీతం ఎక్కువ చేయబడును.

మంచి మిలిటరీ పోలీసువానికి దేహ మనో దారుఢ్యములు ఎక్కువగ నుండవలెను. కనుక అతి సమర్థులే యీ స్కూలులో చేరి, వారి కొసంగబడు నలుపు ఎరుపు చేతి బాడ్జీలను సగర్వంగా ధరించగలరు.

శిక్షణకాలం చాల తక్కువ. కాని చాల కఠినముగ నుండును. శిక్షితులు ఆరు వారాలు నిపుణులగు ఉపాధ్యాయుల క్రింద చెప్పిన పనంతా చేయాలి. ఉపాధ్యాయులందరు భారతీయులే, ఒక్క ప్రధానోపాధ్యాయుడు మాత్రం భారతీయుడు కాడు. ఆయుధాలులేని పోరాటం, బండ్ల రవానా కంట్రోలు, మిలిటరి న్యాయము, నిబంధనలకు కట్టుబడియుండుట, మోటారు సైకిలు త్రొక్కుట, భద్రత కాపాడుట, మ్యాపులు చదువుట ప్రమాదాలు జరిగితే రిపోర్టు చేయుట, రోడ్లపై గస్తీ ప్రధమచికిత్స యీ పనులన్ని నేర్పబడును.

పరీక్ష సమయమున దుస్తుల నియమాల దగ్గర నుండి గూఢచారులను పట్టుకోడం వరకుగల పనులన్నింటిగూర్చి ప్రశ్నింపబడుదురు.

యుద్ధంలో మిలిటరీ పోలీసుకి యెంత ముఖ్యమయిన పనులుంటాయో సాధారణముగా గుర్తింపబడలేదు. యుద్ధంలో కాన్వాయిలు ఎట్లు నడవాలో వారు నిర్ణయించాలి, మోటారు బండ్ల రవానా సరిచూడాలి, ఖైదీలకు కాపలాగా నుండాలి, వెనుక నుండి పోయేవారిని పట్టితేవాలి, మొత్తంపై సమాచారాలన్ని తెలిపే కార్యాలయంగా పని చేయాలి.

# జపానీయ యునానీయ భేషజం.

1937 సం॥లో చైనాతో జపాను యుద్ధం ప్రారంభించింది. సశాస్త్రీయంగా జపాను ప్రభుత్వమువారు చైనా ప్రభుత్వానికి ప్రతిజ్ఞా పత్రము పంపించి యుద్ధ ప్రకటన చెయ్యకుండానే, కలహం ప్రారంభించి తుపాకులను పేల్చుటకు జపాను సైనికులు పూనుకొన్నారు. ఆ విధంగా చైనాతో జపానువారు ప్రారంభించిన యుద్ధము యీ రోజు వరకూ సాగుతూనే ఉంది. అయిదు సంవత్సరాలైంది. కాని అంతు తెలియకుండా ఉంది. ఇది ఇట్లా సాగుతూ ఉండగానే, రామాయణంలో పిడకలవేట అన్నట్లుగా, బ్రిటిష్‌వారిమీదనూ, అమెరికావారిమీదనూ జపానువారు 1941 సం॥ డిశంబరు మాసంలో యుద్ధం ప్రకటించారు. రష్యా మీద మాత్రం జపాను యుద్ధం ప్రకటించలేదు. చైనా రాజ్యం బ్రహ్మాండమైనది. 45 కోట్ల జనాభా గల రాజ్యం. జపాను చిన్న లంక. 9 కోట్ల జనాభా రమారమిగా కలది. చైనా అనేటటువంటి ఏనుగు ముందర జపాను అనేది ఎలుకవంటిది. కాని, యీ చిట్టి ఎలుక మిట్టిపడుతూ ఏనుగను పీనుగను చేస్తానని ఎగిరింది. కోతికి కొబ్బరికాయ దొరికినట్లుగా అయింది. చైనాతో కలహం కల్పించుకొని, చైనాను మింగివేయవలెననే దురాశతో, కొబ్బరికాయలోనే కోతి తన తల దూర్చినట్లుగా, చైనా యుద్ధంలోనే జపాను చిక్కుకొని ఉంది.

కొబ్బరికాయలో దూర్చిన కోతి తల, కొబ్బరికాయలోనుంచి ఊడివచ్చుట లేదు. కొబ్బరికాయలోని కొబ్బరికూడా కోతి తినలేకుండా ఉంది. ఒక్క చైనాతోనే, ఇంత అవస్థపడుతున్న జపాను, తిని కూర్చుండి తిమ్మిరెత్తి, అమెరికా యింగ్లాండుల మీదకూడా యుద్ధం సాగించింది. "ఎవడురా నా కెదురాడి పోరాడువాడీరేడు జగంబులందు? నా శౌర్య వీర్య ప్రతాప ప్రభావంబుచే ముల్లోకంబులు అల్లకల్లోలమై తల్లడిల్లగలవు!" అన్నట్లుగా, బ్రహ్మాండమైన చైనా రాజ్యంమీదను, బ్రహ్మాండమైన అమెరికా రాజ్యంమీదను, అఖిల ప్రపంచవ్యాప్తమైన బ్రిటిష్ సామ్రాజ్యంమీదను జపాను కత్తికట్టింది.

జపాను తలపెట్టినపని జపానుకు తలముక్కలుగా ఉంది. అమెరికా యుద్ధనావలతో సాలమను దీవులవద్ద జపాను యుద్ధనావలు ముమ్మారు యుద్ధంచేసి తడిసి ముప్పందు అయినాయి. జపాను యుద్ధనావలు సముద్రంలో ముమ్మారు మునకలువేసి మళ్లీ పైకిరాకుండా మాయమైనాయి. న్యూగినీ యుద్ధంలో బోనావద్దను గోనావద్దను జపానుసేన "రానా?" అనకుండా "పోనా?" అంటున్నది. అక్కడ అమెరికను సేనలమధ్యను, ఆస్ట్రేలియను సేనల మధ్యను అడకత్తెరలోని పోకకాయవలె జపాను సేనలు నొక్కుకొనిపోయి

---

## మీరు జపానుభాష మాట్లాడుదురా?

చాలమంది మాట్లాడుచున్నారు.
ఎవ్విధమైన శాంతి లేకుండ చేయుచు,
మార్కెటులందు ధరలు అకారణంగా హెచ్చు తగ్గులు అగునట్లు,
ప్రతి వ్యక్తికి కొంత అనవసరమగు నష్టము కలుగునట్లు,
ఘోరమైన పుకారులను పునశ్చరణ చేయుచున్నారు.
ఈ పుకారులు జపానునుండి వచ్చుచున్నవి.
వానిని లక్ష్యం చేయకండి.
వానిని వ్యాపింప జేయకండి.

* పుకారులను నమ్మకండి *

జపానువారి ఎదుర్కొనుటకై దేశీయ యుద్ధరంగం తయారుచేయుడు.





బ్రిటీషు రాజ కుటుంబము.

బ్రిటనులో జాతీయ ప్రార్థన దినమునాడు రాజ దంపతులు తమ స్కాట్లండు మందిరం వద్దనున్న చర్చిలో ప్రార్థనలు చేసిరి. అప్పుడు తీయబడిన పటము.

జార్జి రాజుగారు, ఎలిజబతు రాణి, వారి కుమార్తెలు ఎలిజబెతు మార్గరెటు రోజుగార్లు ఇందుగలరు.

నవి. యుద్ధారంభదశలో మాత్రం బ్రిటిష్‌వారు న్నూ, అమెరికావారున్నూ యుద్ధానికి పూర్తిగా తయారుగా సిద్ధంగా లేనిసమయంలో కొంతవరకు హఠాత్తుగా జపాను విజృంభించి బ్రిటిష్‌వారి బర్మాలోను, అమెరికావారి ఫిలిప్పయిను దీవులలోను ప్రవేశించి ఆక్రమించిన మాట వాస్తవమే. కాని, యిప్పుడు ఇండియాలో వావెలు సేనాని చేయవలసిన సైనిక సన్నాహములన్నీ సమగ్రంగా చేసియున్నాడు. వావెలు సేనాని దక్షిణ సైనిక వ్యూహ సాధకములను శ్రద్ధగా పరిశీలించి వజ్రపు తునకవంటి ముక్క ఒక్కటి అన్నాడు. "గత ఏడెనిమిది మాసాలకంటె ఇప్పుడు, జపానువల్ల ప్రమాదం సంభవించుననే భయం తొలగిపోయింది. జపానువాళ్లు అడుగుపెట్టినచోట అణగ ద్రొక్కగలం. అంత తయారుగా మన బ్రిటిష్ సేనలు ఇప్పుడు ఉన్నాయి. ఈమాట ఖరార్" అన్నాడు. ఈ మాటలలో అర్థం ఉంది. ఇండియాకు అమెరికను విమానాలు, బ్రిటిష్ విమానాలు విరివిగా వచ్చి చేరియున్నవి. విమానబలంలో జపానుయొక్క శక్తి గాలిలోపెట్టిన దీపంవంటిదే. ఏవో కొలది విమానాలను నిర్మించుకొని ఉన్నది. కాని, అమెరికాలో సంవత్సరానికి 60 వేల విమానాలు ఇప్పుడు తయారవుతున్నాయి. అమెరికా నుంచి అవి మిత్రరాజ్యాల యుద్ధరంగాలకు పంపబడుతున్నాయి. అంత అపారంగా అమెరికాలో తయారవుతున్న విమానశర పరంపరలకు జపాను విమానబలం ఆగలేదు. ఇప్పుడు న్యూగినీలోను, సాలమను దీవులవద్దను జపానువాళ్లు దెబ్బ తిని పారిపోవుటకు కారణ మేమిటి? అమెరికను ఆకాశదుర్గ విమానాల ధాటికి సాటిగా పోటీకి రాలేక, జపాను విమానాల కిక ఆకాశంలో అవకాశం లేక, గాలివీడి నేలగూలుతున్నాయి. పిట్టలవలె రాలుతున్నాయి. విమానబలంలో జపానుకు పైచెయ్యి అమెరికావారిదే. అమెరికా విమానాలు, బ్రిటిష్ విమానాలుకూడా ఇప్పుడు ఇండియాలో దండిగా ఉన్నాయి. ఈ విమాన బలానికి ఎదురు జవాబు చెప్పలేక, ఇటీవల అస్సాము సరిహద్దులవద్దకు వచ్చిన జపాను విమానాలకు చచ్చి చెడి చేయంగల విన్నపము లన్నట్లయింది. ఒక్క విమానదాడిలో రమారమి 18 జపాను విమానాలు పడగొట్టబడినాయి. మన విమానాలు నాలుగు మాత్రమే నష్టమైనాయి.

కాని, జపానువాళ్లకూడా వావెలు సేనాని యొక్క సైన్యంతో ఒక కుస్తీ చేయవలెననే

కుతూహలంతోనే ఉన్నారు. ఇండియాలోకికూడా వీలైతే, ప్రవేశించవలెననే సంకల్పం జపాను వాళ్లకు ఉంది. ఇండియా బర్మా సరిహద్దులలో అక్యాబువద్దకు జపాను సేనలను చేర్చినట్లుగా వార్తలు వచ్చాయి. జపాను సేనలకు అన్నీ ఉన్నాయిగాని అయిదోతనం తక్కువ అన్నట్లుగా పంచమ భూతమైన అకాశంలో విమాన బలం మాత్రమే చాలా తక్కువగా ఉంది.

అయినప్పటికీ జపాను సైనికులు యుద్ధానికి తయారవుతూనేయున్నారు. జపాను మొగవాళ్లు మాత్రమే కాకుండా, జపాను ఆడవాళ్లుకూడా యుద్ధానికి తయారవుతున్నారని ఇటీవల వచ్చిన వార్తలవల్ల తెలిసింది. ఈ జపాను ఆడవాళ్లకైనా అయిదోతనం ఉన్నదో లేదో! సాలమను దీవులలో గ్వాడాలుకెనారువద్ద యీమధ్య అమెరికను సేనకూ, జపాను సేనకూ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో జపాను సైనికులు చాలామంది రణరంగంలో హతులైనారు. చచ్చిపడియున్న జపాను సైనికుల శవములను అమెరికనులు తరువాత పరీక్షించిచూస్తే, మొగ దుస్తులను ధరించియున్న జపాను ఆడసోల్జర్లు చాలామంది కన్పించారు. ఈ విధంగా జపాను మొగవాళ్లు మాత్రమే కాకుండా, జపాను ఆడవాళ్లుకూడా యుద్ధానికి సిద్ధమవుతున్నారు. కాబట్టి జపాను ఆడపటాలాలుకూడా తయారైనాయి. జపాను విమానబలం ఎంత బాగా పోరాడుతున్నదో వారి ఆడసైనికులుకూడా అంత బాగా పోరాడగలరు. "వార్" అంటే ఇంగ్లీషులో యుద్ధం అని అర్థం. వీరులు చేసేది "వార్". ఇటువంటి "వార్" చెయ్యడానికి వచ్చిన జపాను కాంతలను "వార్ కాంతలు" అనడానికి సందేహంలేదు. వారకాంతలు (అనగా భోగం సానులు) జపానులో బహుశః సమృద్ధిగా ఉన్నారేమో! అందుచేతనే జపాను వారకాంతలను వెంటపెట్టుకొని జపాను మొగ సైనికులు తమ మొగతనం చూపించడానికి తయారవుతున్నారు. బలే! బాగాఉంది! జపాను సైనికుల శౌర్య వీర్యవృద్ధి అంతకంతకు యీరీతిగా హెచ్చుతోంది. యుద్ధానికి తయారుకావడం అంటే ఇదే కాబోలు! ఇందుకొరకై వస్తాదులవలె తయారుకూడా తింటున్నారేమో! ఆయుధాల బలం విమానబలం తక్కువైనా ఆయుర్వేద వైద్యంలో చెప్పిన ప్రకారంగా మొగతనం వృద్ధిచేసే వాజీకరణ ఔషధాలు యేవైనా సేవిస్తున్నారేమో! మన నాజీకరణ తంత్రం జపాను వాళ్లకు తెలియకపోయినా, జర్మనీవాళ్లు నేర్పిన నాజీకరణ తంత్రం మాత్రం కొద్దిగా జర్మను నాజీలవద్ద చూచి నేర్చుకున్నారు.

న్యాయంగా ధర్మంగా, సవ్యంగా సక్రమంగా యుద్ధం చెయ్యలేకపోతే, జర్మనులు నేర్చుకున్న బ్రహ్మరాక్షసి విద్య యేమిటంటే విషవాయు ప్రయోగాలు చేయడం చైనాలో యీవరకే జపానువారు సవ్యంగా యుద్ధంచేసి గెలువలేక, 876 పర్యాయములు (చైనా యుద్ధారంభమునుంచి అనగా 1937 వ సం॥నుంచి 1941 వ సం॥ జూను మాసం ఆఖరువరకు జరిగిన కాలంలో), అనేక విధములైన విషవాయువుల బాంబులను ప్రయోగించియున్నారని చైనా ప్రభుత్వ యుద్ధకార్యాలయంవారి లెక్కల రికార్డులో నమోదు చేయబడింది. ఈ విషవాయు బాంబులు అనేకరకాలు ప్రయోగించారు. కొన్ని బాంబులు క్రిందపడి పగిలినతోడనే, ఆ విషవాయువువల్ల కళ్లవెంట నీళ్లువచ్చి కళ్లు కనపడకుండా చేస్తాయి. కొన్ని విషవాయువులవల్ల ఊపిరి సలుపక శ్వాస బంధిస్తుంది. మరికొన్నింటివల్ల మత్తు వస్తుంది. ఇవిగాక, అన్నింటికన్నా ఘోరమైన యింకోరకం విషవాయు ప్రయోగంవల్ల చర్మము యావత్తూ పొక్కి బొబ్బలెక్కి కుష్ఠవ్యాధిగ్రస్తునివలె దేహము దహించుకొనిపోయే పుండ్లు శరీరమంతటా యేర్పడతాయి. 1940 వ సం॥లో జపానువారు యీ ఘోరమైన బాంబులను చైనాలోని కొన్ని యుద్ధరంగాలలో ప్రయోగించారు. కాని, 1941 వ సం॥లో యీ బాంబు ప్రయోగాలను నూటికి 65 వంతున యెక్కువగా ప్రయోగించారు. 1938 వ సం॥లో చైనాలో టాయీరు ష్యాంగు అనేచోట జపానువారు విపరీతంగా, తుమ్ములను తుమ్మించే బాంబులనూ, కన్నీళ్ల బాంబులనూ ప్రయోగించుటవల్లనే, అక్కడ జరిగిన యుద్ధంలో గెలువగలిగినారు.

జపానువాళ్లు యుద్ధానికి తయారయ్యే పద్ధతులన్నీ యెటువంటివో యిప్పుడు బోధపడుతోంది. యుద్ధానికి తుపాకీమందుకంటె యీ విషవాయు ద్రవ్యాలను యెక్కువగా తయారు చేసుకొంటున్నారు. విషద్రవ్య యుద్ధంచేసే ప్రత్యేక పటాలములను కొన్నింటిని తయారుచేసి చైనా యుద్ధరంగాలలోకి తీసికొని వచ్చారు. విషాలతోను, వార్‌కాంతలతోను, సన్నాహమై ఇండియామీదకు

దండెత్తిరావలెనని చూస్తుంటే, వావెలు దోవలో కాచియున్నాడు.

బర్మానుంచి చైనాకు ఒక త్రోవ వుంది. ఆ త్రోవగుండా చైనాకు బ్రిటిషువారు చాలా ఆయుధ సామగ్రిని సప్లయిచేశారు. ఆ త్రోవను బంధిస్తే చైనాకు ఆయుధాల సప్లయి ఆగిపోతుందని జపానువారు ఆశపడ్డారు. కాని, ఇండియానుంచి చైనాకు మరొక కొత్తదోవను బ్రిటిష్‌వారు తయారు చేసారు. ఇండియాలోని అస్సాము రాష్ట్రములో నుంచి చైనాలోని యూనాను రాష్ట్రంలోకి యీదోవ పోతూవుంది. ఈ దోవమీదుగా చైనాకు సప్లయిలు పోతూవున్నాయి. ఇటీవల అనగా డిసెంబరు ఆరో తేదిని ఆరువేల జపాను సేన బర్మా సరిహద్దునుంచి యూనాను రాష్ట్రంలోకి దండెత్తి వెళ్లింది. కాని, యీ జపాను సేనను చైనా సేన చితుకకొట్టి, చావగొట్టి వెనుకకు తరిమింది. యూనాను రాష్ట్రం ఆక్రమించితే, ఇండియా యీశాన్యభాగంనుంచి చైనాకు పోయే తోవను బంధించవచ్చునని జపానువారి ఆశ. కాని, యీ తోవకాకుండా ఇండియా వాయవ్య సరిహద్దు రాష్ట్రాలలో నుంచి సింకియాంగుమీదుగా మరొక తోవను చైనాకు బ్రిటిష్‌వారు తయారుచేసి వుంచారు. యునానులో ప్రవేశించి, అక్కడ త్రోవను బంధించి తన మొగతనం చూపించవలెననే సంకల్పం జపానుకు కలిగింది. జపానువాళ్లు బ్రహ్మాండమైన చైనాను తమ బలపరాక్రమంవల్ల జయించలేక, చైనాకు ఆయుధ సామగ్రులు సప్లయి అవుతున్న త్రోవలను బంధించడమే తమకు చేతనైన పనిగా నిశ్చయించుకొన్నారు. సరియైన ఆయుధబలం లేక, విషద్రవ్యాలను, అపద్రవ్యాలను, చైనావాళ్లమీద ప్రయోగిస్తున్నారు. పురుషులు యుద్ధం చెయ్యడానికి శక్తిచాలక, యుద్ధం చేస్తామనే ఆడవాళ్లను "వారకాంతలను" వెంటబెట్టుకొనివచ్చి తమ శత్రువులను వశీకరణం చేసికొనవలెనని ప్రయత్నిస్తున్నారు. అసలైన మొగతనం లేనివాళ్లే యీ వశీకరణ తంత్రాలు అవలంబిస్తారు. అటువంటి అప్రయోజకులు యునానీ మందులైనా తిని తయారు అయితే బాగుండేది. తాల్‌మఖానా, బీజ్‌బందు, రాతిమదం, రూమీమస్తగీ, బైమణ్‌సఫేదా, మదనమస్త్, సాలామిశ్రీ, శియామిశ్రీ, పంజాబు మిశ్రీ, బాదం, అక్రోట్, పిస్తా, గుబ్బి విత్తులు, వగైరాలతో చేసిన హల్వాలు, లేహ్యాలు దివ్యమైనవి యూనానీ ప్రక్రియలు ఎన్నో ఉన్నాయి. కాని యీ యూనానీ ప్రక్రియలు జపానువాళ్లకు తెలియవు. యూనానీ మురబ్బాలు, మొహర్లు, హల్వాలు, షర్బత్తులు ఉన్నాయి. ఈ యునానీ ప్రక్రియలలో పరిచయం ప్రవేశం లేకుండా యూనానులో ప్రవేశించి యుద్ధతంత్ర ప్రక్రియలు సాగిస్తే చైనావశీకరణం జపానుకు సాధ్యమవుతుందా? ఈ యునానీ యప్రక్రియలన్నీ విడిచిపెట్టి యునానులో యుద్ధ ప్రక్రియలు సాగిస్తే ప్రయోజనమేమిటి? ఈ జపానీయ యునానీయ భేషజం సార్థకంలేని వ్యర్థపటాటోపవైద్యం వంటిది. ఈ భేషజంవల్ల మిత్రమండలిని వశీకరణం చేసికొనడం జపానుకు సాధ్యమవుతుందనే భ్రమతో, జపానువాళ్లు యూనాను రాష్ట్రంమీదకు వెళ్లినారుగాని, "బ్రతుకు జీవుడా!" అని బర్మాలోకి మళ్లీ వచ్చారు. ఎక్కడకు వెళ్లినా, జపానువాళ్లకు ఈ చైనా దండయాత్ర చేదు క్వయినా మాత్రగా ఉంది.

---

### యుద్ధంగూర్చి తెలుగులో రేడియో ఉపన్యాసాలు.

| జనవరి నెల. | టైము. | విషయం. |
|---|---|---|
| 1 వ తేదీ | 1-25 గం. పగలు. | ఎ ఆర్. పి. |
| 1 ,, | 7 ,, రాత్రి. | శత్రువు చెప్పేది. |
| 4 ,, | 7 ,, రాత్రి. | ఐకమత్యం (3) దేశంలో. |
| 6 ,, | 7 ,, రాత్రి. | సమాన పంపకం (3) లోహములు. |
| 7 ,, | 8 ,, ఉదయం. | యుద్ధ విమర్శ. |
| 8 ,, | 8 ,, ఉదయం. | యుద్ధ గతి. |
| 11 ,, | 7-15 ,, రాత్రి. | ముడి పదార్థాలు. |
| 14 ,, | 8 ,, ఉదయం. | యుద్ధ విమర్శ. |
| 15 ,, | 7 ,, రాత్రి. | శత్రువు చెప్పేది. |





## మాల్టా గవర్నరు.

*

జనరలు సర్ విలియం డోబీ, కె.సి.బి., సి.ఎం.జి., డి.ఎస్.ఒ., గారు మాల్టాదీవి గవర్నరుగనుండిరి. ఆ దీవి కడుతీవ్రమగు శత్రు విమానదాడులకు గురియయినది. దాన్ని కడుధైర్యముతో రక్షించిన యీ వీరునకు బ్రిటిషు రాజుగారు "గ్రాండు కమాండరు ఆఫ్ ది ఆర్డరు (జి.సి.ఒ.)" బిరుదొసంగిరి.

"మాల్టా దీవి రక్షణ యికముందుకూడ సమర్ధతతో నిర్వహింపబడగలదని నాకు నమ్మకంగలదు" అని వారు ఉద్యోగంనుండి విరమించిన పిదప దెలిపిరి.

మే 9, 10, 11 వ తేదీలందు 112 శత్రు విమానాలు మాల్టాపై నాశనం చేయబడినవి. పింఛనుగైకొన్న జనరలు డోబీగారు 63 సం॥ వయస్సున 1939 లో మాల్టా గవర్నరుగా నియమింపబడి యిటీవల విడచిరి. వీరు 1935-38 లో మలయ సర్వసేనాధికారిగ నుండిరి.

## కాశీ క్షేత్రం.





జపానువారు సింగపూరును స్వాధీనం చేసుకొన్న వెంటనే ఆ నగరమునకు జపానీ పేరు పెట్టినారు. జపానువారు మన పట్టణములను, పవిత్ర స్థలములను వశపరచుకొనడం తటస్థించినట్లయిన వీటికిగూడ ఇదే విధంగా జరుగుతుంది. మత సాంప్రదాయమువల్లను చారిత్రాత్మకంగాను పేరుగాంచిన పట్టణములన్నియు పాడుచేయుటే గాక జపానీ పేర్లను పెట్టి వాటినే వాడాలని శాసిస్తారు. భారతీయుల అభిప్రాయములను లెక్కచేయరు.

ఈ దేశమునకు చెందిన మన మందరము ఎట్టి పోరాటము లేకుండ అట్టి అనాదరణకు ఒప్పుకుంటామా ? కూడదు. సమిష్టి ప్రతిఘటనచేసి ఈ రాక్షసులను ఎదుర్కొందము.

జపానువారి నెదుర్కొనుటకై
దేశీయ యుద్ధ రంగమును
తయారుచేయుడు.



PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.